వీతేన - క్రొత్త బంగారు కుండలముల కాంతులచే కూడిన, తవ - నీ యొక్క, లోచన రుచేః - కంటి కాంతి యొక్క, పాతేన - ప్రసారము చేత, మామ్ - నన్ను, శీతలయ - చల్లబఱుపుము.

తా|| పర్వత సుతవైన యో కామాక్షీ దేవీ! నీ దృష్టి పాతము పాపసముద్ర భయాతురులకు పోతము. నవకాంచనకుండలాంశు సముపేతము. అట్టి నీ దృష్టి పాతము చేత నన్ను జల్లబఱుపుము.

వి|| అమ్మవారు భూధరకన్యక యని సంబోధింప బడినది. ఆ భూధరము సామాన్య భూధరముకాదు. అది శీత భూధరవే యని శీతలయ (చల్లబఱుపుము) అనుటచే వ్యంగ్యమగు చున్నది. అమ్మ వారి దృష్టి పాతము పాత భయాతురులకు పోతము అనుటచే ద్వితీయ పాదమున రూపకాలంకారమున్నది.

## కటాక్ష శతకం సర్వం సంపూర్ణం



'లోకా స్సమస్తా స్సుఖినో భవంతు'